# అథ పంచవింశో%ధ్యాయః

## సప్తర్షులు పార్వతిని పరీక్షించుట

నారద ఉవాచ |

గతేషు తేషు దేవేషు విధివిష్ణ్వాదికేషు చ | సర్వేషు మునిషు ప్రీత్యా కిం బభూవ తతః పరమ్ || 1

కిం కృతం శంభునా తాత వరం దాతుం సమాగతః | కియత్కాలేన చ కథం తద్వద ప్రీతి మావహన్ || 2

నారదుట్లు పలికెను-

బ్రహ్మ, విష్ణువు మొదలగు ఆ దేవతలు, మునులు అందరూ ఆనందముతో మరలి వెళ్లిన తరువాత ఏమాయెను? (1)

తండ్రీ! శంభువు ఏమి చేసినాడు? ఆయన ఎంత కాలము తరువాత వరము నిచ్చుటకు వచ్చినాడు? ఎట్లు వచ్చినాడు? ఆ విషయమును చెప్పి ప్రీతిని కలిగించుము (2).

బ్రహ్మోవాచ|

గతేషు తేషు దేవేషు బ్రహ్మాదిషు నిజాశ్రమమ్ | తత్తపస్సుపరీక్షార్థం సమాధి స్థోఽభవద్భవః || 3

స్వాత్మాన మాత్మనా కృత్వా స్వాత్మన్యేవ వ్యచింతయత్ | పరాత్పరతరం స్వస్థం నిర్మాయం నిరవగ్రహమ్ || 4

తద్వస్తు భూతో భగవానీశ్వరో వృషభధ్వజః | అవిజ్ఞాతగతి స్సాతిసప్రహరః పరమేశ్వరః || 5

గిరిజా హి తదా తాత తతాప పరమం తపః | తపసా తేన రుద్రో%పి పరం విస్మయమాగతః || 5

బ్రహ్మ ఇట్లు పలికెను-

బ్రహ్మ మొదలగు ఆ దేవతలు తమ స్థానములకు వెళ్లిన తరువాత, శివుడు ఆమె యొక్క తపస్సును బాగుగా పరీక్షింపగోరి సమాధిలోనికి వెళ్లిపోయెను (3). సర్వము కంటె శ్రేష్ఠమైనది, స్వరూపభూతమైనది, మాయకు అతీతమైనది, ఆటంకములు లేనిది అగు ఆత్మ తత్త్వమును ఆయన మనస్సుతో హృదయమునందు ధ్యానించెను (4). ఆ హరుడు తత్పద వాచ్యమగు వస్తు స్వరూపుడు, భగవానుడు, ఈశ్వరుడు, వృషభము ధ్వజము నందు గలవాడు, తెలియబడని స్వరూపము గలవాడు, సర్వకారణుడు మరియు పరమేశ్వరుడు (5). వత్సా! ఆపుడా పార్వతి ఉగ్రతపస్సును చేయుచుండెను. ఆ తపస్సును గని రుద్రుడు కూడ మిక్కిలి విస్మయమును పొందెను (6).

సమాధేశ్చలితస్సో %భూద్భక్తాధీనో%పి నాన్యథా | వసిష్టాదీన్ మునీన్ సప్త సస్మార సూతికృద్ధరః || 7

సప్తాపి మునయశ్శీఘ్రం మాయయుస్స్మృతి మాత్రతః | ప్రసన్న వదనాస్సర్వే వర్ణయంతో విధిం బహు || 8

ప్రణమ్య తం మహేశానం తుష్టువుర్హర్షనిర్భరాః | వాణ్యా గద్గదయా బద్ధకరా వినత కంధరాః || 9

ఆయన భక్తులకు అధీనుడే గాని మరియొకటి కాదు. ఆయన సమాధి నుంచి చలించెను. జగత్కారణుడగు హరుడు వసిష్ఠాది సప్తర్షులను స్మరించెను (7). ప్రసన్నమగు ముఖము గల సప్తర్షులు స్మరించినంత మాత్రాన తమ భాగ్యమును అనేక విధములుగా వర్ణించుకొనుచున్నవారై విచ్చేసిరి (8). వారు ఆనందభరితులై ఆ మహేశ్వరునకు ప్రణమిల్లి, చేతులు జోడించి, తలలు వంచి, గద్గమగు వాక్కుతో నిట్లు స్తుతించిరి (9).

సప్తర్షయ ఊచుః |

దేవ దేవ మహాదేవ కరుణా సాగర ప్రభో | జాతా వయం సుధన్యా హి త్వయా యదధునా స్మృతాః || 10

కిమర్థం సంస్మృతా వాథ శాసనం దేహి తద్ధి నః | స్వదాస సదృశీం స్వామిన్ కృపాం కురు నమో%స్తుతే || 11

సప్తర్షులిట్లు పలికిరి-

ఓ దేవదేవా! మహాదేవా! కరుణాసముద్రా! ప్రభూ! నీవీనాడు మమ్ములను స్మరించుటచే మేము మిక్కిలి ధన్యులమైతిమి (10). ఓ స్వామీ! నీవు మమ్ములను దేనికొరకు స్మరించితివి? నీవా విషయమును మాకు ఆజ్ఞాపించుము. నీ దాసులయందు చూపించే కృపవంటి కృపను చూపుము. నీకు నమస్కారమగు గాక ! (11)

బ్రహ్మోవాచ|

ఇత్యాకర్ణ్య మునీనాం తు విజ్ఞప్తిం కరుణానిధిః | ప్రోవాచ విహసన్ ప్రీత్యా ప్రోత్ఫుల్ల నయనాంబుజః || 12

బ్రహ్మ ఇట్లు పలికెను-

కరుణా సముద్రుడగు శివుడు మహర్షుల ఈ విన్నపమును విని, వికసించిన పద్మముల వంటి నేత్రములు గలవాడై ప్రేమతో నవ్వి ఇట్లు పలికెను (12).

మహేశ్వర ఉవాచ|

హే సప్త మునయస్తాతాశ్శృణు తారం వచో మమ | అస్మద్ధితకరా యూయం సర్వజ్ఞాన విచక్షణాః || 13

తపశ్చరతి దేవేశీ పార్వతీ గిరిజా%ధునా | గౌరీ శిఖర సంజ్ఞే హి పర్వతే దృఢమానసా || 14

మాంపతిం ప్రాప్తు కామా, హి సా సఖీసేవితా ద్విజాః | సర్వాన్ కామాన్ విహాయాన్యాన్ పరవం నిశ్చయమాగతా || 15

తత్రత్ర గచ్ఛత యూయం మచ్ఛాసనాన్మునిసత్తమాః | పరీక్షాం దృఢతాయాస్తత్కురుత ప్రేమచేతసః || 16

సర్వథా ఛల సంయుక్తం వచనీయం వచశ్చ వః | న సంశయః ప్రకర్తవ్య శ్శాసనాన్మమ సువ్రతాః || 17

మహేశ్వరుడిట్లు పలికెను-

ఓ సప్తర్షులారా! కుమారులారా! నా మాటను వెంటనే వినుడు. సర్వజ్ఞులగు మీరు మాకు హితమును చేయువారు (13). దేవ దేవి యగు పార్వతి ఈ సమయములో గౌరీ శిఖరమును పేరుగల పర్వతమునందు దృఢచిత్తయై తపము నాచరించుచున్నది(14).ఓ ద్విజులారా ! అమె నన్ను భర్తగా పొందవలెననే అంతిమ నిశ్చయమును చేసుకొని ఇతర కామనలనన్నిటినీ వీడినది. అమెను సఖురాండ్రు కనిపెట్టియున్నారు (15). ఓ మహర్షులారా! మీరు నా అజ్ఞచే అచటకు వెళ్లి, ప్రేమతో నిండిన మనస్సు గలవారై, ఆమె మనస్సు ఎంత దృఢమైనది? అను విషయమును పరీక్షించుడు (16). మీరు పూర్తి అసత్యములను, నిందవాక్యములను పలుకుడు, దృఢమగు వ్రతము గల ఓ ఋషులారా! మీరు నా శాసనముచే ఈ విషయములో ఎట్టి సంశయమునైననూ పొందకుడు (17).

బ్రహ్మోవాచ|

ఇత్యాజ్ఞ ప్తాశ్చ మునయో జగ్ముస్తత్ర ద్రుతం హి తే | యత్ర రాజతి సా దీప్తా జగన్మాతా నగాత్మజా || 18

తత్రత్ర దృష్టా శివా సాక్షా త్తపస్సిద్ధిరివాపరా | మూర్తా పరమతేజస్కా విలసన్తీ సుతే జసా || 19

హృదా ప్రణమ్యతాం తే తు ఋషయస్సప్త సువ్రతా ః | సన్నతా వచనం ప్రోచుః పూజితాశ్చ విశేషతః || 20

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఇట్లు ఆజ్ఞాపింపబడిన ఆ మునులు శీఘ్రమే అచటకు వెళ్లరి. అచట జగన్మాతయగు పార్వతి గొప్ప తేజస్సుతో విరాజిల్లు చుండెను (18). మూర్తీభవించిన తపస్సిద్ధివలె నున్న, పరమతేజస్సుతో విలసిల్లు చున్న పార్వతిని వారచట చూచిరి (19).దృఢవ్రతులగు ఆ సప్తర్షులు ఆమెకు మనస్సులో నమస్కరించి, ఆమెచే ప్రత్యేకముగా పూజింపబడినవారై, వినయముతో నిట్లు పలికిరి (20).

ఋషయ ఊచుః |

శృణుశైలసుతే దేవి కిమర్థం తప్యతే తపః | ఇచ్ఛసి త్వం సురం కం చ కిం ఫలం తద్వదాధునా || 21

ఋషులిట్లు పలికిరి-

ఓ పార్వతీ దేవీ! వినుము, నీవు దేని కొరకు తపస్సును చేయుచున్నావు? ఏ దేవతను కోరుచున్నావు? ఏ ఫలమును కోరుచున్నావు? ఇపుడా విషయమును చెప్పుము. (21)

వ్రహ్మోవాచ|

ఇత్యుక్తా సా శివ దేవీ గిరీంద్ర తనయా ద్విజైః | ప్రత్యువాచ వచస్సత్యం సుగూఢమపి తత్పురః || 22

ఆ బ్రహ్మణులిట్లు పలుకగా ఆ పార్వతీ దేవి వారి యెదుట పరమ రహస్యమే అయిననూ సత్యము నిట్లు పలికెను.(22)

పార్వతువాచ|

మునీశ్వరాస్సంశృణుత మద్వాకం ప్రీతితో హృదా | బ్రవీమి స్వవిచారం వై చింతతో యో ధియా స్వయా || 23

కరిష్యథ ప్రహాసం మే శుత్వా హ్యసంభవాః | సంకోచో వర్ణనే విప్రా భవత్యేవ కరోమి కిమ్ || 24

ఇదం మనో హి సుదృఢమవశం పరకర్మకృత్ | జలోపరి మహాభిత్తం చికీర్షతి మహోన్నతామ్ || 24

పార్వతి ఇట్లు పలికెను -

మునివరులారా! నా మాటను ప్రీతితో మనస్సును లగ్నము చేసి వినుడు . నేను నా బుద్ధితో ఆలోచించి నిశ్చయించిన నా విచారము చెప్పెదను (23)

అసంభవమగు నా మాటలను విని మీరు పరిహాసము చెసెదరు. ఓ విప్రులారా! మీ ఎదుట వర్ణించుటకు సంకోచము అగుచున్నది. నేనేమి చేయుదును? (24)

ఈ నా మనస్సు నియంత్రింప సంభవము కానిది. నావశము లేదు. అసంభవమగు కర్మలనపేక్షించుచున్నది ఈ నా మనస్సు నీటిపై ఎత్తైన మహా ప్రాసాదమును నిర్మింపగోరుచున్నది.(25)

సురర్షేశ్శానం ప్రాప్య కరోమి సుదృఢం తపః | రుద్రః పతిర్భవేన్మే హి విధాయేతి మనోరథమ్|| 26

అపక్షో మన్మనః పక్షీ వ్యోమ్ని ఉడ్డీయతే హఠాత్| తదాశాం శంకరస్వామీ పిపర్తు కరుణానిధిః || 27

రుద్రుడు నాకు భర్త కావలననే కొర్కెను మనస్సులో నిడుకొని, దేవర్షియగు నారదుని అనుమతిని పొంది తీవ్రమగు తపస్సును చేయుచున్నాను.(26)

రెక్కలు లేని నా మనస్సును అనే పక్షి హఠాత్తుగా ఆకాశమునందు ఎగురుచున్నది. కరుణా సముద్రుడగు శంకరస్వామి దాని యాశను పరిపూర్ణము చేయును గాక ! (27)

బ్రహ్మో వాచ |

ఇత్యాకర్ణ్య పచస్తస్యా విహస్య మునయశ్చతే | సంమాన్య గిరిజాం ప్రీత్యా ప్రోచుశ్చలవచో మృషా ||28

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఆమె యొక్క ఈ మాటలను విని ఆ మహర్షులు నవ్వి ఆ పార్వతిని ప్రీతితో ఆదరించి (మనస్సులో) మాయమాటలను ఇట్లు పలికిరి(28)

ఋషయ ఊచుః-

నజ్ఞాతం తస్య చరితం వృథా పండితమానినః | దేవర్షేః క్రూరమనసః సుజ్ఞా భూత్వాప్య గాత్మజే|| 29

నారదఃకూటవాదీ చ పరచిచిత్తప్రమంథకః |తస్య వార్తాశ్రవణతో హనిర్భవతి సర్వథా|| 30

తత్ర త్వం శృణు సద్బుదదధ్యా చేతిహసం సుశోభితమ్ | క్రమాత్త్వాం బోధయంతో హి ప్రీత్యా తముపధారయ || 31

బ్రహ్మ పుత్రో హి యో దక్షస్సుషువే పితురాజ్ఞయా | స్వపత్న్యా మయుతం పుత్రానయుంక్త తపసి ప్రియాన్|| 32

ఋషులు ఇట్లు పలికిరి-

వ్యర్థముగా తాను పండితుడనను ధారణ గలవాడు, క్రూరమగు మనస్సు గలవాడు అగు ఆ దేవర్సి యొక్క చరిత్ర నీకు తెలియదు. ఓ పార్వతీ! నీవు సహజముగా బుద్ధిమంతురాలవే (29)

నారదుడు మోసపు మాటలను చెప్పి ఇతరుల మనస్సులను కల్లోల పెట్టును. అతని మాటలను విన్నవారికి అన్ని విధములుగా హాని కలుగును (30)

మేము నీకు క్రమముగా బోధించెదము. నీవు మంచి బుద్ధితో ఈ చక్కని వృత్తాంతమును విని ప్రీతితో దానిని తెలుసుకొని మనస్సులో నిశ్చయించుము (31) బ్రహ్మపుత్రుడగు దక్షుడు తండ్రి ఆజ్ఞచే తన భార్య యందు పదివేల పుత్రులను గని, ఆ ప్రియపుత్రులను తపస్సు చేయుడని నియోగించెను. (32)

తే సుతాః పశ్చిమదిశి నారాయణసరో గతాః | తపోeô ర్థే తే ప్రతిజ్ఞాయ నారదస్తత్ర వై య¸° || 33

కూటోపదేశమాశ్రావ్య తత్ర తాన్నారదో మునిః | తదాజ్ఞయా చతే సర్వే పితుర్న గృహమాయయుః || 34

తచ్ఛ్రుత్వా కుపితో దక్షః పిత్రాశ్వాసితమానసః | ఉత్పాద్య పుత్రాన్ ప్రాయుంక్త సహస్ర ప్రమితాంస్తతః || 35

తేeô పి తత్ర గతాః పుత్రాస్తపోeô ర్థం పితురాయజ్ఞయా | నారదోeô పి య¸° తత్ర పునస్తత్స్వోపదేశకృతమ్ || 36

ఆ కుమారులు తపస్సును చేసెదమని ప్రతిజ్ఞచేసి పశ్చిమ దిక్కున నున్న నారాయణ సరస్సుకు వెళ్ళిరి. నారదుడు కూడ అచటకు వెళ్లి (33) వారికి మోసపు ఉపదేశమును చేసెను. వారతని ఉపదేశముచే తిరిగి తండ్రి వద్దకు ఒక్కడైననూ మరలివెళ్లలేదు.(34) ఈ వార్తను విని దక్షుడు కుపితుడు కాగా తండ్రి యాజ్ఞచే అతనిని ఓదార్చెను. అతడు తరువాత మరల వేయిమంది కుమారులను గని తపస్సు కొరకు పంపెను. (35). ఆ కుమారులను కూడా తండ్రి యాజ్ఞచే తపస్సును చేయుట కొరకు అచటకు వెళ్లిరి. నారదుడు కూడ అచటకు వెళ్లి వారికి వైరాగ్యము నుపదేశించెను. (36)

దదౌ తదుపదేశం తే తేభ్యో భ్రాతృపథం యయుః | ఆయయుర్న పితుర్గేహం భిక్షు వృత్తి రతాశ్చతే || 37

ఇత్థం నారదసద్వృత్తిర్విశ్రుతా శైలకన్యకే | అన్యాం శృణుహి తద్వృత్తిం వైరాగ్యకరణీం నృణామ్|| 38

విద్యాధరశ్చిత్ర కేతుర్యో బభూవ పురాకరోత్| స్వోపదేశమయం దత్త్వా తస్మై#ి శూన్యం చ తద్గృహమ్|| 39

ప్రహ్లాదాయ స్వోపదేశాన్ హిరణ్య కశిపోః పరమ్ | దత్త్వా దుఃఖం దదౌ చాయం పరబుద్ధి ప్రభేదకః || 40

అతని ఉపదేశముచే వారు కూడ సోదరుల మార్గములో వెళ్లిరి. వారు భిక్షాటన యందభిరుచి గలవారై తండ్రి గృహమునకు మరలి పోలేదు.(37) ఓ శైలజా! నారదుని మంచిదనము ఈ తీరున లోకప్రసిద్ధమై యున్నది. మానవులలో వైరాగ్యమును కలిగించే అతని మరియొక గాథను వినుము(38). పూర్వము చిత్రకేతు డనే విద్యాధరుడుడుండెను. నారదుడాతనికి తన ఉపదేశమును చేసి అతని ఇంటిని శూన్యము చేసెను. (39). ఇతరుల బుద్ధిలో భేదములను కల్పించే ఈ నారదుడు తన ఉపదేశములను ప్రహ్లాదునకు చేసి హిరణ్యకశిపునకు మహా దుఃఖమును కలిగించెను.(40)

మునినా నిజ విద్యా యచ్ఛ్రావితా కర్ణరోచనా| సస్వగేహంవిహాయశు భిక్షాం చరతి ప్రాయశః ||41

నారదో మలినాత్మా హి సర్వదోజ్జ్వల దేహవాన్ | జానీమస్తం విశేషేణ వయం తత్సహవాసినః |7 42

బకం సాధుం వర్ణయంతి న మత్స్యానత్తి సర్వథా | సహవాసీ విజానీయాచ్చరిత్రం సహవాసినామ్ || 43

లబ్ధ్వా తదుపదేశం హి త్వమసి ప్రాజ్ఞ సంమతా | పృథైవ మూర్ఖీభూతా తు తపశ్చరసి దుష్కరమ్ || 44

యదర్థ మీ దృశం బాలే కరోషి విపులం తపః | సదోదాసీ నిర్వికారో మదనారిర్న సంశయః || 45

ఆ ముని ఎవనికి వినుటకు రుచించే తన విద్యను వినిపించునో, వాడు తప్పని సరిగా తన ఇంటిని వీడి వెంటనే భిక్షాటనను మొదలిడును (41). నారదుని దేహము సదా ప్రకాశించునదే. కాని అతని మనస్సు మలినము. అతనితో కలిసి నివసించే మాకు అతని గురించి పూర్తిగా తెలియును (42). కొంగ సాధువు అని కొందరు చెప్పెదరు. కొంగ అన్ని వేళలా చేపలను తినదు గదా! సహవాసుల చరిత్ర సహవాసులకుమాత్రమే తెలియును కదా! (43) నీవు బుద్ధి మంతురాలవే అయిననూ అతని ఉపదేశమును పొంది మూర్ఖురాలవై వ్యర్థముగా కఠినమగు తపస్సును చేయుచున్నావు.'44). అమ్మాయీ! నీవు ఎవని కొరకై ఇంత విస్తారమగు తపస్సును చేయుచున్నావో ఆ శివుడు సర్వదా ఉదాసీనుడై ఉండును. అయన నిర్వికారుడు, మన్మధ శత్రువు అనుటలో సందేహము లేదు.(45

అ మంగలవపుర్ధారీ నిర్లజ్జోeô సదనోభకులీ | కువేషీ ప్రేత భూతాది సంగీ నగ్నో హి శూలభృత్ || 46

స ధూర్తస్తవ విజ్ఞానం వినాశ్య నిజమాయయా | మోహయామాస సద్యుక్త్యా కారయామాస వై తపః ||47

ఈదృశం హి వరం లబ్ధ్వా కీం సుఖం సంభవిష్యతి | విచారం కురు దేవేశి త్వమేవ గిరి జాత్మజే || 48

ప్రథమం దక్షజాం సాధ్వీం వివాహ్య సుధియా సతీమ్ | నిర్వాహం కృతవాన్నైవ మూఢః కించిద్దినాని హి || 49

శూలధారియగు శివుడు అమంగళమగు శరీరము కలిగి సిగ్గులేని వాడై యుండును. ఆయనకు ఇల్లు లేదు. కులము లేదు. ఆయన దిగంబరుడై చెడు వేషమును కలిగి ప్రేతపిశాచాదులతో స్నేహమును చేయును (46). ఆ మోసగాడు తన మాయచే నీ బుద్ధిని చెడగొట్టి నిన్ను అనేక గొప్ప యుక్తులతో మోహింప జేసి నీచే తపస్సును చేయించుచున్నాడు (47). ఇట్టి వానిని వివాహమాడిన స్త్రీకి ఏమి సుఖము కలుగును? ఓ దేవదేవి! పార్వతీ నీవే ఆలోచించుము(48). ఆ మూర్ఖుడు ముందుగా దక్షపుత్రి, పతి వ్రతయగు సతిని వివాహమాడి సద్బుద్ధితో కొద్దిరోజులైననూ సరిగా కాపురము చేసినాడు కాదు(49).

తాం తథైవ సవై దోషం దత్త్వాత్యాక్షీత్స్వయం ప్రభుః | ధ్యాయన్ స్వరూపమకలమశోకమరతుస్సుఖీ || 50

ఏకలః పరనిర్వాణో హ్యసంగోఽద్వయ ఏవ చ| తేన నార్యాః రథం దేని నిర్వాహస్సంభవిష్యతి || 51

అద్యాపి శాసనం ప్రాప్య గృహమాయాహి దుర్మతిమ్ | త్యజాస్మాకం మహాభాగే భవిష్యతి చ శం తవ || 52

ఆ ప్రభువు ఆమె యందు స్వయముగా దోషమును చూపి పరిత్యజించినాడు. ఆయన నిరవయవము, శోకరహితమునగు ఆత్మ తత్త్వమును ధ్యానిస్తూ సుఖముగా రమించుచున్నాడు(50). ఆయన ఏకాకి, పరమమోక్ష స్వరూపుడు, సంగరహితుడు, ఆద్వితీయుడు, ఓ దేవీ! ఒక యువతి అతనితో ఎట్లు వేగ గలదు? అది సంభవము కాదు (51). ఈనాటికైననూ మా ఆజ్ఞను మన్నించి చెడు బుద్ధిని వీడి ఇంటికి వెళ్లుము. ఓ పుణ్యాత్మురాలా! నీకు శుభము కలుగగలదు.(52)

త్వద్యోగ్య హి వరో విష్ణుస్సర్వసద్గుణవాన్ ప్రభుః | వైకుంఠవాసీ లక్ష్మీశో నానాక్రీడా విశారదః || 53

తేన తే కారయిష్యామో వివాహం సర్వసౌఖ్యదమ్ | ఇతీదృశం త్యజ హటం సుఖితా భవ పార్వతి |7 54

మంచి గుణములన్నింటినీ కలిగియున్న విష్ణు ప్రభుడు నీకు తగిన వరుడు. ఆయన వైకుంఠ నందుండును. లక్ష్మీ పతియగు విష్ణువు వివిధ క్రీడలలో నిపుణుడు.(53) ఆయన తోడి వివాహము సర్వసుఖముల నిచ్చును. నీకు ఆ వివాహము మేము చేయించెదము. ఈ మొండి పట్టును విడువుము, ఓ పార్వతీ! సుఖపడుము (54).

బ్రహ్మోవాచ-

ఇత్యేవం వచనం శ్రుత్వా పార్వతీ జగదంబికా | విహస్య చ పునః ప్రాహ మునీన్ జ్ఞానవిశారదాన్ || 55

బ్రహ్మ ఇట్లు పలికెను-

సత్యం భవిద్భిః కథితం స్వజ్ఞానేన మునీశ్వరాః | పరం తు మే హఠో నైవ ముక్తో భవతి హే ద్విజాః || 56

స్వతనోశ్శైల జాతత్వాత్కాఠిన్యం సహజం స్థితమ్ | ఇత్థం విచార్య సుధియా మాం నిషేద్ధుం న చార్హథ ||57

సురర్షేర్వచనం పథ్యం త్యక్ష్యే నైవ కదాచన | గురుణాం వచనం పథ్యమితి వేదవిదో విదుః || 58

గురుణాం వచనం సత్యమితి యేషాం దీఢా మతిః | తేషామిహాముత్ర సుఖం పరమం నాసుఖం క్వచిత్ || 59

పార్వతి ఇట్లు పలికెను-

ఓ మహర్షులారా! మీరు మీకు తెలిసిన సత్యమును పలికితిరి. ఓ బ్రహ్మణులారా కాని, నాకు గల ఈ హఠము తొలిగిపోయేది కానే కాదు(56). నేను పర్వతుని కుమార్తెను అగుటచే సహజముగానే

కఠినురాలను. మీరు మంచి బుద్ధితో ఈ సత్యమును విచారించి నన్ను తపస్సు చేయవద్దని వారించుట తగదు (57) దేవర్షి యగు నారదుని హితకరమగు వచనమును నేను ఎన్నటికీ త్యజించును గురువుల వచనము హితకరమని వేదవత్తలు చెప్పెదరు(58). గురువుల వచనము సత్యమనిఎవరికైతేదృఢమగు నిశ్చయము ఉండునో వారికి ఇహ పరలోకములలో పరమ సుఖము కలుగును. వారికి ఎచ్చటనైననూ దుఃఖము లేదు(59).

గురుణాం వచనం సత్యమితి బద్ధృ దయే న ధీః | ఇహాముత్రాపి తేషాంహి దుఃఖం న చ సుఖం క్వచిత్ || 60

సర్వథా న పరిత్యాస్యం గురుణాం వచనం ద్విజాః| గృహం వసేద్వా శూన్యం స్యాన్మే హఠ స్సుఖదస్సదా|| 61

యద్భవద్భి స్సుభణితం వచనం మునిసత్తమాః | తదన్యథా తద్వివేకం వర్ణయామి సమాసతః || 62

గుణాలయో విహారీ చ విష్ణుస్సత్యం ప్ర కీర్తితః | సదాశివోeô గుణః ప్రోక్తస్తత్ర కారణముచ్యతే ||63

గురువుల వచనం సత్యమనే నిర్ణయం ఎవరి హృదయములో ఉండదో, వారికి ఇహమునందు, పరమునందు కూడ దుఃఖము కలుగును. వారికి ఎచ్చటనైననూ సుఖము కలుగదు(60). ఓ బ్రహ్మణులారా! గురువచనమును ఎట్టి పరిస్థితులోనైననూ వీడరాదు. నా ఈ హఠము నన్ను గృహిణిని చేసి శాశ్వత సుఖము నీయ వచ్చును. లేదా నాకు శూన్యము మిగులవచ్చును (61). ఓ ముని శ్రేష్ఠులారా! మీరు చక్కగా చెప్పిన వచనము సరిగాదు. దానిలో గల వివేకమును సంగ్రహముగా చెప్పెదను. (62) విష్ణువు గుణ సంపన్నుడనియు, విహరించువాడనియు చెప్పితిరి సత్యమే. సదాశివుడు గుణహీనుడని చెప్పబడినాడు.దానికి గల కారణమును చెప్పెదను(63).

శివో బ్ర హ్మ వికారస్స భ##క్తేహేతోర్ధృతాకృతిః| ప్ర భుతాం లౌకికీం నైవ సందర్శయితుమిచ్ఛతి || 64

అతః పరమహంసానాం ధార్యతే సుప్రి యా గతిః| అవధూత స్వరూపేణ పరనందేన శంభునా ||65

భూషణాదిరుచిర్మాయా లిప్తానాం బ్రహ్మణో నచ | సప్ర భుర్నిర్గుణోeô జో నిర్మాయోeô లక్ష్యగతిర్విరాట్ ||66

ధర్మజాత్యాదిశ్శంభుర్నాను గృహ్ణాతి వై ద్విజాః | గురోరనుగ్ర హేణైవ శివం జానామి తత్త్వతః || 67

పరబ్రహ్మ యొక్క సగుణ రూపమే శివుడు. ఆయన భక్తుల కొరకై ఆకారమును పొందినాడు. ఆయనకు లౌకికమగు సామర్థ్యమును ప్రదర్శించవెననే ఆకాంక్ష లేనే లేదు(64) ఇందువలననే అవధూత స్వరూపుడు పరమానంద ఘనుడునగు శివుడు పరమహంసలకు ఆనందముతో పొందదగిన పరమగతియై ఉన్నాడు.(65) మాయా లేపము గలవారికి అలంకారాదులయందు అభిరుచి ఉండును. కాని పరబ్రహ్మకు అట్టి అభిరుచి ఉండదు. ఆ ప్రభుడు నిర్గుణుడు, పుట్టుక లేని వాడు. మాయాలేపము లేనివాడు, ఆయన స్వరూపము ఇంద్రియ గోచరము కాదు. కాని విరాడ్రూపములో నున్నది ఆయనయే (66). ఓ బ్రాహ్మణులారా! ధర్మము, జాతి, మొదలగునవి శివుని అనుగ్రహమును పొందుటలో హేతువులు కాజాలవు. గురువు యొక్క అనుగ్రహము చేత మాత్రమే నేను శివుని యథార్ధ స్వరూపము నెరింగినాను.(67)

చేచ్ఛివస్స హి మే విప్రా వివాహం న కరిష్యతి | అవివాహ్ సదాహం స్యాం సత్యం సత్యం వదామ్యహమ్|| 68

ఉదయతి యది భానుః పశ్చిమే దిగ్విభాగే ప్రచలతి యది మేరు శ్శీతతాం యాతి వహ్నిః | వికసతి యది పద్మం పర్వతాగ్రే శిలాయాం న హి చలతి హతో మేసత్యమేతద్బ్రవీమి || 69

ఓ బ్రహ్మణులారా! ఆ శివుడు నన్ను వివాహమాడనిచో, నేను అవివాహితురాలిగా శాశ్వత కాలము మిగిలి యుందును. నేను ముమ్మాటికీ సత్యమును పలుకుచున్నాను.(68) సూర్యుడు పశ్చిమ దిక్కునందు ఉదయించిననూ, మేరు పర్వతము కదలజొచ్చిననూ, అగ్ని చల్లబడిననూ, పర్వతశిఖరముపై రాతి మీద పద్మము వికసించిననూ, నా ఈ హఠము చలించదు. నేను సత్యమును పలుకుచున్నాను.(69).

బ్రహ్మోవాచ-

ఇత్యుక్త్వా తాన్ ప్రణమ్యాశు మునీన్సా పర్వతాత్మజా | విరరామ శివం స్మృతా నిర్వికారేణ చేతసా ||70

ఋషయోఽపి తద్ద మాజ్ఞాయ గిరిజాయాస్సునిశ్చయమ్| ప్రోచుర్జయగిరం తత్ర దదుశ్చాశిషముత్తమామ్ || 71

అథ ప్రణమ్య తాం దేవీం మునయో హృష్ట మానసాః | శివస్థానం ద్రుతం జగుస్తత్పరీక్షా కరా మునే ||72

తత్ర గత్వా శివం నత్వా వృత్తాంతం వినివేద్య తమ్ | తదాజ్ఞాం సమనుప్రాప్య స్వర్లోకం జగ్మురాదరాత్|| 73

ఇతి శ్రీ శివ మహాపురాణ రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే సప్తర్షికృత పరీక్షావర్ణనం నామ పంచవింశోఽధ్యాయః (25)

బ్రహ్మ ఇట్లు పలికెను- ఇట్లు పలికి ఆ పార్వతి వెంటనే ఆ మహర్షులకు నమస్కరించి వికారము లేని మనస్సుతో శివుని స్మరించి విరమించెను.(70) ఆ ఋషులు కూడా పార్వతి యొక్క ఇట్టి దృఢనిశ్చయము పెరంగి, 'జయము కలుగుగాక! 'అని ఉత్తమమగు ఆశీర్వచనమును పలికిరి(71). అపుడు అనందముతో నిండిన మనస్సుగల ఆ మునుల ఆ దేవికి నమస్కరించిరి. ఓ మహర్షీ! వారీ విధముగా ఆమెను పరీక్షించి వెంటనే శివుని స్థానమునకు వెళ్లిరి(72).

వారు అచటకు వెళ్లి శివునకు నమస్కరించి ఆ వృత్తాంతమును నివేదించి ఆయన ఆజ్ఞను పొంది ఆదరముతో స్వర్గలోకమునకు వెళ్లిరి (73).

శ్రీ శివ మహాపురాణములోని రుద్రసంహితయందు పార్వతీ ఖండలో సప్తర్షులు పరీక్ష చేయుట అనే ఇరువది యైదవ అధ్యాయము ముగిసినది (25).